


# బెజవాడ కనకదుర్గాంబ శతకము.



క౦॥ శ్రీరమణీ వినుతాంబా।
ఘోరదురితశైల శంబ గుణనికురుంబా
నీరదవేణి విడంబా।
నారీ బెజవాడ సత్కనక దుర్గాంబా॥

క౦॥ అంబరముఁగూడి వాజి వ।
గంబోంకు నటంచు శివదిగంబరివానీ
డంబము సరెనను శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబ! మదాంబా। ౨

క౦॥ శంబర మొక్కటి కేలను
శంబరము శిరంబునందు సరెసరెనే న
ర్థాంబిక నాయను శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబమదాంబా॥ 3

క౦॥ అంబుజములుదాల్చియు వా
డంబమునని యేరునిల్పు డమరుకధరయా
చుంబితగేరెటి శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౪

క౦॥ అంబిక నామది నీ పా
దంబులపై యుండునటుల దయసేయవది
[illegible]

క॥ త్ర్యంబకమత ధూషుల నిశి
తాంబకములపాలుజేసి యఖిలసుర కదం
బంబుల నేలవె శరజ
న్మాంబా బెజవాడకాళికాంబ మదాంబా॥ ౬

క॥ అంబూకృత గీతనతీ
స్తంబవిజిత వాసినిన్ను సరసోక్తుల డిం
దంబున గొలిచెద శరజ
న్మాంబా బెజవాడకాళి కాంబమదాంబా। ౭

క॥ జంబూనది జాంబూనద।
జంబాలముగన్యజేసి చతురాస్యుని
న్నాంబునకిడడే శరజ।
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౮

క॥ అంబికనీపద రాజీ
వంబులుభజియించినాడ వడినాదుష్క-।
ర్మంబులు బాపవె శరజ।
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౯

క॥ కంబంబున బొడమిన పీ
తాంబరధర తోడబుట్టి దయచేముల్లో
కంబులనేలవె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౦

క॥ అంబుజ సంభవు వరగ
ర్వంబున మహిషుండు నిన్నువడి మార్కొనిప్రా
ణంబులు విడవడె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౧

క॥ జాంబవతి నీదుపదప
ద్మంబులుమదినిల్పి విష్ణుదారామణియై
సంబర మొందదె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౨

క॥ కంబుత్రిశూలము గంటయు
శంబరమును గేలఁబూను సాంబశివుని దే
హంబున సగమౌ శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౧౩

క॥ లంబాలక నీదు కపో
లంబులు ముకురంబులనుచు లవిశంకరు స
చ్చుంబనల మెచ్చు శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౧౪

క॥ బింబంబధరము చిల్కల
గుంబల్కులు కనులు మీంట్లుకుచములు కపలా
చుంబాదలియళులర శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౧౫

క॥ నింబాళిచీరెగట్టి కు
సుంబాకంచుకము దొడగి సుందరమౌ వే।
సంబుల నొందరె శరజ।
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౧౬

క॥ అంబిక నీ మోముకు శశి।
బింబం బెనగాక గగనవీథికి కనుచు।
తుంబైన నోడె శరజ।
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౧౭

క॥ అంబుదము నీదు వేణీ।
కంబళమున గోడిగిరుల కానలబడి వా।
దంబాడి గ్రిక్కె శరజ।
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౧౮

క॥ శంబరహార మతిఖలగిరి।
శంబలసద్గుణ కదంబ శంబర నేత్రి।
బింబాధరివౌ శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౧౯

క॥ అంబరక ఖంచకు డలను త్రి।
యాంబకు నెదిరించు ఖగిది వన్నృతులునిను పా
స్యంబాడి చెనరె శరజ।
న్నాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౦

క॥ అంబురు హాప్త్రప్రతి బిం।
బంబనగా మెరయురత్న పతక మొనగునీ।
లంబన మెన్నద శరజ।
న్నాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౧

క॥ అంబుజరుహా నేత్రీహార।
చుంబిత బింగా ధగోష్టి సుశ్రీహితవాణీ
యంబుగ వేసే శరజ।
న్నాంబా। బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౨

క॥ భంబులనిం చును నీదున।
ఖాంబులు పద్మములు నీదృగంబులు గద నీ
లాంబుద కచవా శరజ।
న్నాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౩

క॥ తాంబూలీ సంభసం।
[illegible]బుల పోకలను క్రజశుభంబుగనీ ధా
మంబుల నించరె శరజ।
న్నాంబా బెజవాడ కాళికాంబమదంబా॥ ౨౪

క॥ సాంబకరాలంబితకుచ
శంబరవైరిమతి గారిసాక్షీయుశిరో।
లంబనమాలక శరజ।
న్నాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౫

క॥ జాంబూనదాంబరాభర
ణంబులు ధరియించి క్రమమథ సాధుని వామాం
కంబున మెరయవె శరజ
న్నాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౨౬

క॥ అంబరసమమధ్య మశశి
బింబసదృశముఖవిరాజి బింబాధరి శా
దంబగమన వర శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౨౭

క॥ పంబల తప్పెట్లమృదం
గంబుల రవములును నీదుగణములుపత్రి గా
మంబుల నెగడరె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదంబా॥ ౨౮

క॥ తాంబూలంబులు గమధూ
పంబులుగొని యుగ్రములను బ్రిబలెగణములూ
ళ్లంబీకింపవె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౯

క॥ తెంబలగా మేకల గొ
ర్లంబొరిగొని భక్తగణము రక్షించిన నీ
సంబర మొంచెద శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబమదాంబా॥ 30

క॥ కంబుల పూరించుచు నృ
త్యంబుల చెలరేగి నీదయావేశులు కో
పంబున నెగడరె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ 3౧

క॥ అంబర కేశునితో వా
దంబాడిన దక్షునింట పడగియు హిమవం
తంబున బుట్టవె శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబమదాంబా॥ 3౨

క॥ లంబోదరు డెంతో మో
దంబున నినుగొల్వ మదమదపరు పగిది త్వే
మంబొసగు మాకు శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబ! మదాంబా॥ 33

క॥ కంబీలం దింగలమిడి
రంబెముగను దీపముసగి రాత్రులుస్నీ ము
త్రింబులనుమువరె శరజ
న్నాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౪౮

క॥ జంబీర ఫలములను శు
భంబుగనీ ముంగరునిచి ప్రజలందరు నృ
త్యంబులు జేయురె శరజ
న్నాంబా బెజవాడకాళికాంబమదాంబా॥ ౪౯

క॥ చెంబులు మూతలుగాకల
శంబులన్నై వేద్యమునీచి జనములు సంతో
షంబుగ వచ్చేరా శరజ
న్నాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౫౦

క॥ కంబములు నిల్పియిటికెల
గుంబంబులు గట్టినీదు కొలుపులు ప్రతిగ్రా
మంబుల జేయురె శరజ
న్నాంబా బెజవాడకాళికాంబ మదాంబా॥ ౫౧

క॥ దంబము కృష్ణోత్తర శై
లంబుననివసించి భక్తులకు బహుసామ్రా
జ్యంబుల నివ్వవె శరజ
న్నాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౫౨

క॥ తింబళి నినుగొల్వగ మీ
దంబున వేశ్యాజనంబు తాళగతులనా
ట్యంబాడిరిగద శరజ
న్నాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౫౩

క॥ జంబూఫలం బుకిత్రియును వి
షంబుగళంబందునిల్పు శూలుధవని పేరి
మంబలినముపవె శరజ
న్నాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౫౪

క॥ తాంబూరనాదముగా
త్రింబాక్కటి గాగ్గబలుకు తాళజ్ఞలతో
సంబరమొందవె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౫౫

క॥ అంబరము నోరయునీగుడి
కంబములందిడిన దీపకళికలునక్ష
త్రంబులనదగును శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౫౬

క॥ బింబంబని నీయధరో
ష్టంబుశుకంబాను నమృతశంభుముగని మో
దంబొందెనుగద శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౫౭

క॥ జాంబూనదగిరికామ్రక
మంబుధి యంబుధియగాగ నలరినశివు డెం
దంబంమమెలగు శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౫౮

క॥ ధంబులదింపుచును నీదున
ఖంబులు పద్మములు నీమృగంబులుగద నీ
లాంబుదకచవా శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౫౯

క॥ కుంభిణిదుష్కృత జనభా
రంబుడుపుమటంచునిన్నొరహి వేడిన కో
పంబున వెడలితి శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౦

క॥ శంబరముకేల బూనిన
శంభునియర్ధాంగివై శుంభునివని డెం
దంబునగొల్తును శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౧

క॥ శంబరమున నిలు డెత్తుక
దంభకుడై పోవుచునుచు దాల్చువరు ఫణీ
లంబనల మెచ్చు శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౨

క॥ శంభునితలభిక్షాపా
త్రింబుగఁ గొన్నట్టి శంభుదారామణి నే
మంబుగ నెంతును శరజ
న్మాంబా బెజవాడకాళి కాంబమదాంబా॥ ౬౩

క॥ సంభాదంబులనిను వే
దంబుల చేనునువపేర్మి దళుక్కొత్తగ నే
రంబెంచదగును శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౪

క॥ కుంభముమహిసురాదిజ
నంబులునీధాః కడరిన మ్రులమని ఖే
దంబులఁ మానరె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౫

క॥ కాంభోజలాటదహాళాం
ధ్రింబులజను లెల్లనీకు ధగుకాన్కలు వే
గంబునదెచ్చిరి శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౬

క॥ దంభకుడై రావణుఁడురు
జృంభణమునన చలమెత్తి సోలుచుదిరాబల్
గంభీరమెంచ శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౭

క॥ దంభకమతకుత్సితలక
దంభోళివటంచునిన్ను దలతును నా ధి
త్తాంభోజమునను శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౬౮

క॥ గంభీరఘోషఘనసం
రంభంబునమించువాద్య రవములతో నీ
జృంభణము మెరసె శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబ! మదాంబా॥ ౧౯

క॥ అంభోజోద్భవుడుచిత
స్తంభముల వేదినగ్ని సాక్షిగనిను శ్రీ
శంభునకుగూర్చె శరజ
న్మాంబా బెజవాడకాళికాంబమదాంబా॥ ౨౦

క॥ అంభోదరగర్జితవా
గ్దంభకజనగళవిదారి కరుణాకరు ది
వ్యాంభోజముఖవె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౧

క॥ కుంభజముఖ సంయమినికు
రుంభము భవదీయ గృహావిలోకనమున మో
తుంబందిరిగద శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౨

క॥ శంభుడు విజయుడు కిటికై
శుంభత్కోపమునబోరు చుండగగనిమో
దంబొందితివె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా॥ ౨౩

క॥ జంభలఫలములు నీకుచ
కుంభంబుల కీడుగాక కోపలబడి వా
దంబడెచూడగ శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౨౪

క॥ సంభాసిలి జంభలకుచ
జంభారినుతాంఘ్రియుగళి శాంభవినావి
స్రంభము మాన్పవె శరజ
న్మాంబా బెజవాడకాళికాంబ మదాంబా॥ ౨౫

క॥ రంభలకున్నాటి నీతొడ
లంబుజములు బోలుపదములనవిని నీ
కుంబాటిలేరు శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబముదాంబా॥ ౨౬

క॥ అంబరమణి కాంతిశిలా
స్తంభఘటితవాస వాసిశ్శైలనిర్మింబా
స్తంబవిహారివి శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబముదాంబా॥ ౨౭

క॥ డంబముగను నీముందట
కుంభంబులబోసిగొర్ల గోసియుబలు నృ
త్యంబాడిరిప్రజ శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబముదాంబా॥ ౨౮

క॥ గుంబములు వదలిచెంబులు
కంభీల్గొని జనముల్లెల్ల గదలియు వనవా
సంబును జేయరె శరజ
న్మాంబా! బెజవాడ కాళికాంబముదాంబా॥ ౨౯

క॥ అంబుధి జంబాలంబై
నంబుధజన కగ్రిమాంబు సడమడిభిడిర్న
దంభముబలుకవు శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ ముదాంబా॥ ౩౦

క॥ శంభుసతి రంభణంబున
సంభాసిత చిత్తవైన జంభబల్లభఘనా
దంభము లుడుపవె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబముదాంబా॥ ౩౧

క॥ రంభాస్తంభ ప్రతిరూ
పంబులు నియూరువుల్కు స్వర్ణంభస్సని సా
ధ్యంబుగదా వర శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబముదాంబా॥ ౩౨

క॥ జాంబూనదగరుడశిలా
స్తంభస్థగితంబుగాక దనరినసీ దే
హాంబుభజియింతు శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౧౩

క॥ శంభునుగంగనుసీపా
దంబులబడవైచెదనగ దగెకృష్ణా న
ద్యాంబుదవేణీ శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౪

క॥ బంభరసమకుంతలకా
దంబగమనకంబుకంఠి దైత్యాంతకి చి
త్రాంబరధారివి శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౫

క॥ శంభుడుకాళీయనిహా
స్యంబాడినగౌరవర్ణమైతివినీ న
త్వంబేమనదగు శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౬

క॥ డాంబికమునదిరుగను కొం
డెంబులు బల్కంగసేర డెందంబునసీ
జృంభణమెన్నద శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౭

క॥ అంభోధిస్తంభుండగు
శంభునిశాంబరిజయించి సొంతివనముచే
తంబాదలితివా శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౮

క॥ శుంభద్బలయుతదానవ
కుంభినిచయసింహరూపి గురుతరకోపీ
శాంభవివీవే శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౧౯

క॥ శుంభద్ఘుంభవిదారీ
కంబుగళీయంబుజాక్షి కంబుచయుధరీ
శుంభద్గుణినా శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౯౦

క॥ దంభకనికురుంబముపై
తాంబమధరుడాదివిష్ణుడనిగొల్వక వా
దంబులమశయరె శరజ
న్మాంబా బెజవాడకాళికాంబమదాంబా॥ ౯౧

క॥ ఓంభూర్భువరివదక్షుని
ఖంబువిఖాతంబు జేసి కడువడిహిమ గో
త్రింబునబుట్టవె శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా॥ ౯౨

క॥ అంబికనినుభువనావ
స్తంభప్రతిమలుగ జేసి జనులందరు మో
దంబునగొలువరె శరజ
న్మాంబా బెజవాడకాళికాంబమదాంబా॥ ౯౩

క॥ యంబెరు మానారుపదా
బ్జంబులు మదిదలచినీదు సన్మతిగొని ప
ద్యంబులు జేసితి శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబ మదాంబా। ౯౪

క॥ అంబికనీ చరితములం
దంబగు కందములుగాగ సఖలజనా నం
దంబుగ జెప్పితి శరజ
న్మాంబా బెజవాడ కాళికాంబమదాంబా। ౯౫

క॥ తాంబూలీస్తంభస్త
భంబులపోకలను ప్రజశుభంబుగనీ ధా
మంబులనించరె శరజ
న్మాంబా బెజవాడకాళికాంబమదాంబా। ౯౬

క॥ స్తంభాద్రిపురికి వాగ్నే
యంబున కొండపలి దక్షిణాచలశిఖ రా
గ్రంబందునుండు శరజ। న్మాంబా। ౯౭

క॥ శంబర భరకృష్ణాతీ
రంబగు నాగులవరంబు రాజిలు శుభ వా
సంబుగనుండుదు శరజ। న్మాంబా। ౯౮

క॥ కుంభినితుమ్మల చెరువన
యంబగు వంశాబ్ధిచంద్రు శ్రీ మల్లయ పా
దాంబుజసేవ్యుఁడ శరజ। న్మాంబా। ౯౯

క॥ కుంభినిగల సరికొండకు
లంబున జనియించు నర్సరాయాఖ్యుఁడ నీ
కుంబరిచారుఁడ శరజ
న్మాంబా బెజవాడకాళికాంబ మదాంబా॥ ౧౦౦

కీర్తన — నాదనామక్రియ — ఏకతాళం.

అంబశ్రీ దుర్గాంబ శశిబింబ। బెజవాడకాళికాంబ వేదీడంబ
సనితంబ। అంబశుభని కురుంబ। విద్రుమబింబ ఖలగిరిశంబ
సుగుణకదంబ కోపాలంబ చండీకాంబ మదంబ ॥అం॥ ౧

సూరిచిత్తాగారచారిణి। నీరాదవేణి ధీరమనుజధారకారణి
ఘోరదైత్యవిదారిసుందర ధారిభవ్యవికారి। సురిఫలకారి జగ
దుపకారి బొబ్బలమారిదివ్యా। కారిగారి ॥అంబ॥ ౨

మేటి వాగ్జంఝూటి జయవాటి నేటా లలనాటికాటిలాధిత
కోటిజితిపోటి। కోటిసంపత్పేటి। భగవద్ధాటి యద్భుతధాటి
కేసరిఘోటి బాహాస్ఫోటి కల్పవనాటి శుకవాచాటివబోటి॥అ॥ ౩

శూలిపోలికమించువరశూలి। పాలితశీలి కాలగళనుత। శ్రీబ
వనమాలీమాళి ధరితను। మాళిపరిమెళహేళి కనకాంబోళిమేమ
నివాళినిచ్చి। విరాళిజెందు ఘువాళి నేలె తాళిగలమా। అ। ౪

దంభకజ నాలంభ సంరంభి। జంభారివైభవి కుంభిణీ
హిత। కార్యవైలంభి శుంభదశిలస్తంభ సంభవి బంభరకచవ
సుంభరాభరి। శాంభవీ నీడింభకుని విస్రంభమున క్షేమంబు

లోసగుము । కంబుకంఠీ ।అ। ౯

అందవిడకుందుమందు । సరికొండ । వంశుంపనరశింహుండ
నీదయనొందు ధన్యుండ । వెండికొండకు గండుమగిలిన దండి
జెల్లెలుకొండవారికి నండితుడనై । నిందు వేడుక బొందుచుల్లెల
దండలిత్తును దంపమురెల్లీ ।అ॥౭॥ మం ం గ ళ హా ర తి.

మంగళంసర్వలోక మాతయైన పార్వతీకిమంగళానీవాళి
బట్టి మగువలివ్వరే। మంగ। ౧

లింగనాథునకు బొసంగహంసగా వామాంగమునను
రంగుమీర నిలచినట్టి రమణికిక్కువు। మంగ। ౨

శరసురారిభూతి చేత శంభుసివరించి చంద్రబింబమై
వెలుంగు కాళికాంబకెప్పుడు॥ మం। ౩

ఓంకారమై వెలుంగు ఝూంకారమూననిలచి శాంకరీ
మైనయట్టి సాధ్వికందరు। మం। ౪

పన్నాగాను వేదప్రాకన్నాలాను బ్రోచికీర్తిగాన్న
వన్నెలాడియైన సన్నుతాంగికి। మం। ౫

కొండయందుబుట్టి రత్నకుండలములుదాల్చి నాగకుం
డలు మోహించినట్టి కొమ్మకిచ్చుతో। మం। ౬

కంబ్రహ్మ మనుచు శరలు ఖండితముగ బలికిరిట్లు
త్వంబ్రహ్మ మనుచు దుర్గతోడగూడరే। మం। ౭

ఒంటిగాను కంటిలోన జంటలేక వెలుగు ముక్కంటి
నంటియుంచుతమిస్ర కంటిజానకు॥ మం। ౮

ఆరుచక్రములగడచి మేరుచక్రమూననిలచి వేరులేని
బ్రహ్మముండు చెరివేదరే। మం। ౯

సందడములు మలపిశివుని డెందమూన నిలపి నాద
బిందుకళలనెరిగి తత్వమందు గలయరే। మం। ౧౦

దిట్టమైన గుమనికరుణ పుట్టుగిట్టులాను దెలసి గట్టిపట్టి
రట్టుకట్టినట్టి రొట్టికి। మం। ౧౧

నిండు వేడ్కతోడ సారికొండనారసింహకవిని దండిగాను
తేలుచున్న ధర్మమూర్గకు। మంగ। ౧౨



శ్రీ మార్యపరబ్రహ్మణేనమః.
శ్రీ మద్గురుచరణారవిందాభ్యాన్నమః.
శ్రీ హయగ్రీవాయనమః.

# గ్రహరాజశతకము.

క॥ శ్రీరమణీవాసములగు
సారసముల కాప్తుడైన ఛాయేశుండి
ద్ధారణి సరికొండకులో
ద్ధారుని లక్ష్మీనృసింహు ధన్యుని జేయు౯ ౧

క॥ శరణని వేడినవారల
దరిజేర్చువటంచుని యుతి దప్పకమదిలో
విరివిగ గొలచియు నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౨

క॥ ధరభటాగ్రజసువంశా
భరణుడనై నిన్నుగొల్తు భాసురమతిచే
వరమిచ్చిబ్రోతువని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। 3

క। ధరసరికొండసువంశా
కరలక్ష్మీనారసింహ కవినగు నే నీ
వరశతకము జెప్పితి భవ
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౪

క। సిరిగలిగిధర జెలంగిన
వరతుమ్మలచెర్వు వంశభవుడగు మల్లే
శ్వరగురునికృపను నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౫

క॥ కరమొప్ప పండిత స్తుత
వరుడగు శ్రీరంగరాజ భట్టరు పాదాం
బురుహంబుల గొల్చియు నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౬

క॥ ధరకృష్ణాతీరంబున
బరగిన నాగులవరంబె భాస్వత్కరమం
దిరముగ నుండియు నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౭

క॥ కురురాజువకీర్తనములు
కరమొప్పగ నిచ్చినట్టి కంసారికి ప్రియ
న్వర నేత్రము లిమ్మని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౮

క॥ సరసిజభవహరిహరరూ
పరయంగా దాల్చి జగము పాలించెటి నీ
సరిదాతగల డెయుమ్మ
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౯

క॥ ధరణిని ద్వాదశరూపము
లురుతరముగ దాల్చి వరబలోన్నతిచే ని
ద్ధర పాలించెదవని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౧౦

క॥ సురగిరి దిరుగుచు నీవే
పరమాత్ముడవై ధరిత్రి భాస్వత్కాంతిం
గరమొప్ప వెలుగునీ స
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౧

క॥ వరమునియగు దూర్వాసుని
గురుతర మంత్రము నవనివ్వ గోరినకుంతి
స్కరమొప్ప గూడితని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౧౨

క॥ ధరణిన్నస్యపునకు సుం
దరియైవిలసిల్లు నదితితనయులలోన
న్నురుతరుడవనుచు నే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౩

క॥ విరివిగఛాయాదేవిని
కరమొప్పగ పెండ్లియాడి ఘనుడగు శమను
న్వరసుతునిగబడసిన నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౪

క॥ పరమాత్ముడై నశౌరికి
వరపుత్రికనిచ్చితీవువై భవమునభా
స్కరుడవగనీ కతగునీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౫

క॥ అరవిందాసనముఖ ని
ర్జరవరులెవరైననీకు జతరాగలరే
పరమాప్తుడవని నే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౬

క॥ అరుణచ్ఛాయలుగల సుం
దరమూర్తివటంచు నిన్ను తప్పక మదిలో
నిరతము గొల్చియు నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౭

క॥ పరికింపనిన్నుబోలిన
సురలిలలోగలరె వెదకిచూచిననేనీ
చరణములునమ్మియుమ్మ
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౧౮

క॥ అరయగసుగ్రీవుడు నీ
వరతనయుండగుచు మనుజవరుడగు రాము
న్కరమొప్పగొల్చెననినీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౯

క॥ నిరతము నిను భజియించిన
మొరవిన వేటికి మహాత్మ్యమును జేసిన వా
దురితములు దురింతువని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౦

క॥ విరివిగ నానయనంబులు
మరిమరి మసకలనుగప్పె మన్నించిన భా
కర దీప్తులొసగుమని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౨౧

క॥ ధరలో తనయుని తప్పులు
సరగున జనకుడు క్షమించి సాకిన గతిన
న్కర మొప్పు బ్రోతువని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౨౨

క॥ ధర దుర్గుణముల కేతకి
పరగ పరిసూనంబు చేత భాసిలు గతినే
చరితము కృతి జేసితి భవ
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౨౩

క॥ గురుతరమగు నీ నామము
ధర నుడివిన మాత్రమున్ను ధన్యుడగు గదా
శరణని కృతి జేసి భవ
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౪

క॥ మొరవినకున్నను నీ సుం
దరి మా తల్లియునుగాదె ధవునకు నేకాం
తరమందు దెల్పునని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౫

క॥ ధర కరుణాడు నీ సుతుడై
విరివిగ జన్మించె గాన వితరణఖనివై
మొర శెవని వేడినే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౬

క॥ నరుడెవ్వడైననుసతతము
పరమాత్మాహ్వయమనినిన్ను ప్రార్థించినచో
దురితములుదొలగునని నీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ ౨౭

క॥ పరిపరివిధముల వేడిన
వెరువకమనివల్క కున్న వృజినావళి నే
భరియింపజాలుదునె నీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ ౨౮

క॥ శరణంటిమరుగుజొచ్చితి
దరిజేర్చుమటంటి నీకుదాసుడనంటి
న్వరమువ్వవేమిరా నీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా ౨౯

క॥ ధరవాకత్సమయంబున
వరమిచ్చెటిదొరవటంచు వర్ణింతును పా
మరుడననేటికినే నీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ 30

క॥ నరగునమోక్షంబివ్వని
దొరవైనిక నేమిజేతు తొలిజేసినదు
ష్కరకర్మమనుచు నే నీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ 31

క॥ గురినిల్పినిన్ను బొగడితి
నిరయంబెటుగల్గునయ్య నీరజసఖప
త్పరమార్థ మొసగవే నీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ 32

క॥ ధరనిన్ను పూజించనిమ
ష్కరునకు కైవల్యమెపుడు గలుగదటంచు
న్విరచించితిశతకము నీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ 33

క॥ అరివరులదృంచి భువినీ
పరివివహాము సేలితివి మాతాముదమునశ్రీ
హరివై వెలిగెటి యుష్మ
త్కరుణకు కేల్ మోడ్తుభావుక గ్రహరాజా ౩౪

క॥ అరయధరిత్రినినీ
సద్గురుతీరరూపమున భూతకోటులు విలసి
ల్లిరిపద్మమిత్రనేనీ
కరుణకు కేల్ మోడ్తుభావుక గ్రహరాజా ౩౫

క॥ వరసప్తతురంగంబుల
కరముప్పెటివొంటిగిల్ల గలిగివరథమం
బరమునమెరయగజనునీ
కరుణకు కేల్ మోడ్తుభావుక గ్రహరాజా ౩౬

క॥ వరసత్వముదర్పకవం
బరమణివై యులరు నీప్రభావముదామో
దరుడెన్న నేరడనినీ
కరుణకు కేల్ మోడ్తుభావుక గ్రహరాజా॥ ౩౭

క॥ సురనరపన్నగ కిన్నర
వరులై ననునీదు వెల్గు వలనననాదే
పరికింతురఖిలమని నీ
కరుణకు కేల్మోడ్తుభావుక గ్రహరాజా॥ ౩౮

క॥ విరివిగనేత్రాండంబున
వరవిద్యుల్లేఖయగుచు బరగినటిహా
కరయుంగదరమేయుష్మ
త్కరుణకు కేల్ మోడ్తుభావుక గ్రహరాజా॥ ౩౯

క॥ గురుదయబడసినవారలు
పరిపూర్ణంబెరిగినన్ను బ్రార్థించితిప్రభా
కరమాయమందురునే నీ
కరుణకు కేల్మోడ్తుభావుక గ్రహరాజా॥ ౪౦

క॥ స్త్రీరమణిని స్వేడినను
వ్వరయుగ్మతలెట్లుగల్గు ఖలులకుస్థిర
న్పరమాత్ముఁడవనినే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక శ్రీమహారాజా॥ ౪౧

క॥ ధరనాపత్సమయంబున
బురికొనుకుతుకమునవిన్ను బాగడితిఁగొండ్రీ
వరమిచ్చిబ్రోతువనినీ
కరుణకు కేల్మోడ్తు భావుక శ్రీమహారాజా ౪౨

క॥ ధరరాయన భాస్కరభూ
సురవర్యునినిన్నుఁగొల్చి శోభనకరమా
వరముగానెంచుచునే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక శ్రీమహారాజా॥ ౪౩

క॥ నిరుపమ దారిద్ర్యయముచే
పరితప్తుఁడనగుచునిన్ను బ్రార్థించితిఁ శ్రీ
కరముసగిబ్రోవవే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక శ్రీమహారాజా ౪౪

క॥ పురుషుఁడు దర్పణమునఁదన
గురుతరచిహ్నములు గాంచగోరినరీతి
న్బరగుదువుజగతిలో నీ
కరుణకు కేల్మోడ్తు భావుక శ్రీమహారాజా ౪౫

క॥ ధరణీసురవరులు నిరం
తరమఘ్యంబిడుదురడితనయాశ్రీశా
మొరవినవేటికినే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక శ్రీమహారాజా ౪౬

క॥ దురమున సమసినవీరులు
పరలోకముకేగునపుడు బంధురబింబా
తరమాగ్గమిడుదువని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక శ్రీమహారాజా ౪౭

క॥ హరితనయుడాంజనేయుడు
హరిని ప్రార్థించి విద్యలన్నియు నేర్చె
గురువరుడవనుచు నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౪౮

క॥ సరసీరుహనాభుడవై
సరసీరుహనేత్ర భంగి సకలజగంబుల్
కరమొప్పబ్రోచితివని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౪౯

క॥ శరణని నీ చరణంబులు
కరమొప్పగ నా దుహృదయ కమలములోను
స్థిరమతినిల్పియు నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౫౦

క॥ విరివిగ శుభ్రాంశుడునీ
కరసంస్పర్శమున పూర్ణ కళల వెలంగె
వ్వరమిచ్చి బ్రోవవే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౫౧

క॥ నిరతము నిప్రార్థించిన
నరులకు కష్టములుగలవె నళినీహితనా
దురితములు బాపవే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౫౨

క॥ గరుడధ్వజునకు జగముకు
వరనేత్రంబవయి వెలుగు వరముడవని సు
స్థిరమతిగొల్చియునే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౫3

క॥ తరువులలో కల్పకమన
గిరివరములలోన మేరుగిరిపోలికని
జరులందుఘనుడవని నీ
కరుణకు కేల మోడ్తు భావుక గ్రహరాజా॥ ౫౪

క॥ పురుషులలో నీసదృశులు
తరుణులలో ఛాయవంటి తామరసాక్షు
ల్ధరలో లేరని నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౬౨

క॥ మరకతమాణిక్యోజ్వల
వరరత్నస్థగితమకుట వైభవకరభా
సురమూర్తి వనుచు నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౬౩

క॥ పరులను యాచించిన
దుర్భరకష్టమె కాని సుఖము ప్రాప్తించదటం
చరవిందమిత్రనే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౬౪

క॥ ధరణినిగాలము దిరిగిన
వరపృథురోమంబు కరణివంచించి దిమతా
దురితములు జేసియున్న
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౬౫

క॥ విరివిగమానవులుండిన
నిరి వేలుపులెవ్వరైన నీసములౌనా
నిరదాతవనుచు నే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౬౬

క॥ జరబాధమూర్ఛబాధల
పరితాపము జెందినిన్ను ప్రార్థించినవా
మొరవినవేటికి రానీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౬౭

క॥ తెరవెరుగక కంకనబడు
చిరజీవిగతిం ధరిత్రి చిక్కులబడినీ
చరణములు నమ్మియున్న
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౬౮

క॥ ధనకూటికి లేకను నే
నరులనుయాచించి నీచ నమునడిచేతం
జరియించితినిక యుష్మ
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౧౯

క॥ మొరబెట్టితి వేడితి హా
మరుడనుజథుడనయి నీదుమహనియ్యాకృతి
న్విరచించితి బ్రోచితివే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౦

క॥ గిరిదాకులెగరుకరణిని
వరకవివర్గములదూరి వంచనబడిదు
శ్చరితములుమానినే నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౧

క॥ హరి నీనామమహాత్మ్యము
హరిహరులకుపొగడవశమె హరిశౌర్యశుభా
కర తేజవికర్తన నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౨౨

క॥ ధరవెలుగులదొరవీవె
పరమాత్మునిబ్రోవకున్న న్యాయంబగునా
శరణంటినితండ్రినీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౩

క॥ పరమాద్భుతోక్తులచే
పరగునమాతల్లియైన ఛాయామణినీ
కొరుగం దెల్పునని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౪

క॥ అరవిందాసనుడని వి
న్నరవిందాసనుడు గారతాతయనుచును
న్కర మొప్పబ్రోచెనని నీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౨౫

క॥ ధరయందు వెదకిచూచిన
పరమాత్ముఁడ వైననీవె బ్రహ్మవునీవే
హరుఁడవునీ వేనని నీ
కరుణకు కేల్మోడ్చు భావుక గ్రహరాజా॥ ౮౩

క॥ సురదీర్ఘికావతంసుని
వరనేత్రంబవనినిన్ను వాసవముఖుని
ర్జరు లెంచిరనుచు నేనీ
కరుణకు కేల్మోడ్చు భావుక గ్రహరాజా॥ ౮౪

క॥ అరిభయకరుఁడగు సోముని
కరమొప్పఁగ వృద్ధినొందగాఁ జేసిననీ
చరణములు నమ్మియున్న
త్కరుణకు కేల్మోడ్చు భావుక గ్రహరాజా॥ ౮౫

క॥ అరవిందహితుఁడవనినీ
కరవిందార్చనలపూజ లనుదినమును సు
స్థిరమతిసల్పుచు నేనీ
కరుణకు కేల్మోడ్చు భావుక గ్రహరాజా ౮౬

క॥ పరమేష్ఠికిపౌత్రుఁడవని
యురమున నాలుగలవాని నుతులిరదీప్తి
స్ఫురగునయుతవంబవనినీ
కరుణకు కేల్మోడ్చు భావుక గ్రహరాజా॥ ౮౭

క॥ ఉరగంబులు వివిధములై
బరగియున్నః కాలమునను భాస్కరవరబం
ధురమతి మొక్కుదురనినీ
కరుణకు కేల్మోడ్చు భావుక గ్రహరాజా॥ ౮౮

క॥ పరిమార్చ ప్రరోగంబులు
నెరవేర్చవెనన్ను నేను నిగమాధారా
మొరవినవేటికిరానీ
కరుణకు కేల్మోడ్చు భావుక గ్రహరాజా॥ ౮౯

క॥ పరమాహ్లాదంబునసీ
చరణములర్చించునరులు సౌఖ్యంబునిరం
తరమునుబడయుదురనిసీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా ౯౦

క॥ ధరకూటిలో రాయిదియ్యని
నరుజేటిలో రాయిదియ్య నగు బాటగునా
పరితాపముమాన్పవనీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ ౯౧

క॥ సిరిగలిగిన దుశ్చరితుడు
పరమార్థుడు గాడటంచు భవదియ్యపదాం
బురుహంబులు గొల్చియునీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ ౯౨

క॥ అరుణద్యుతిగలిగిన భువి
గురిగింజకు వెల్వగలదె కుటిలాత్ముడు నీ
వరభక్తుజై నెయుమ్మ
త్కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ ౯౩

క॥ పురుషులలో శ్రీరాముడు
సురలందువనీవె ముఖ్యశుభమూర్తి వటం
చరవిందమిత్ర నేనీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ ౯౪

క॥ గిరిముకురంబునగనుపడు
కరణిని బ్రహ్మాండముల ప్రకాశించెటి శ్రీ
హరినీవటంచు నేనీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా॥ ౯౫

క॥ ధరనుపనయనముచే భూ
సురవరుడగు కరణినిన్ను జూచిన్నుతిచే
నరుడును గుణుడగునదినీ
కరుణకు కేల్మోడ్తుభాస్కర గ్రహరాజా ౯౬

క॥ గురువరుడు శిష్యునకు స
త్పరిపూర్ణంబనుచు దెల్పు భావము నేత్రాం
తరమందునగని నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా॥ ౯౭

క॥ ఏరివిగనుమునిను రాఘవు
డురుతరముగ బ్రోచినటుల నుజ్వల సంత
త్కారమొసగుదువని నేనీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౯౮

క॥ దురితాత్ముడితడని హా
మరుసనివను బ్రోవవేని మహితవనామ
స్మరణకు లోపంబనినీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౯౯

క॥ అరయుభవద్యుతి తమముల
హరియించిన భంగివన్మ దాపదలనిరం
తరమును దాఘుతుదువనినీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౧౦౦

క॥ విరివిగ బాల్యప్రభృతిని
పరదారాసక్తి మోహ పరవశమున నే
దురితములు జేసియున్న
త్కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా ౧౦౧

క॥ నిరయంబు జేరకుండగ
పరలోక సుఖంబొసంగి భవజాలముల
న్హరియింప జేయుమనినీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౧౦౨

క॥ వరదాతవైననీవే
ధరణికిదొరవీవ కన్నతండ్రివినీవే
పరమాప్తుడ వీవనినీ
కరుణకు కేల్మోడ్తు భావుక గ్రహరాజా। ౧౦౩

క॥ ధరమోత్మా సత్కదక్షా
స్త్రిరమతిని స్నైల్పినట్టి దీనుడనేనీ
చరణములు నమ్మియున్న
త్కారుణకు కేల్ మోద్తుభావుక గ్రహరాజా॥ ౧౦౪

## మంగళ హారతి.

మంగళంబని బాడరే సఖులూ । గ్రహరాజునకుజయమంగళంబని బాడరేసఖులూ । సంగరంబునాను దైత్య పుంగవూలగెల్చి వేలుంగచున్న యట్టిభవభంగుడౌ పతంగునాకు॥ మం॥ సూరివందితచారుగాత్రునకు। వారాశిసమ గంభీరునకులోకోపకారునకూ। నీరజాప్తుడై యనంతనీరజంబులానుబ్రోదిభూరి రోగమూలద్రుంచి పేరుజెందు శూరునాకు । మం। మిన్నజెందిన వన్నెగలదొరకూ ప్రాపన్నులను సంపన్నులుగ గావించు ధన్యునకూ । కన్నతండ్రియైమెధరిత్రి కశ్యపూని తనయుడగుచు పన్నుగాన జాండముశుభంబుమీరగాచురవికి । మంగ। చల్లగా సరికొండకులుడైన । నరశింహసత్కవి యుల్లమును రంజిల్లజేసిన వల్లభూని కెల్లకాల మెల్లవీధమూలభాల్లే । కొల్లగా సంపాదలెగజల్లుభల్లి దూనిజూది॥ మం॥

—• గద్య •—

మచ్చన్న కేశ్వర వరప్రసాదలబ్ధ కవితావిచిత్ర
తుమ్మలచెయ్య మల్లయామాత్య ఛాత్ర
లసదాత్రేయ గోత్రపవిత్ర కోటం
రాజు సుపుత్ర సరికొండ
లక్ష్మీ నృశింహరాజు కవి
ప్రణీతంబైన బెజవాడ
కనకదుర్గాంబ
శతకము
గ్రహరాజశతకము
సంపూర్ణం.

శ్రీ రామార్పణమస్తు. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

# కరువు కీర్తన.

పంచముఖ నిటలాక్షు జీవన పతికి దెలిపియు వర్షమును గురిపించవే । మము కరుణించవే ॥ పం ॥

మించెగాడ్పులు ప్రాణములు శోషించె ధాత్రీ స్థలిని పాలించవే మొరయాలించవే ॥ పం ॥

అంచెలుగ సర్కారువారే తెంచి గోవుల బందెలకు తోలించిరీ యడవి బిగియించిరీ ॥ పం ॥

పంచి బ్లాకులటంచు గహనము పలుదెరంగుల జేసి రిజర నుపించిరి యాజ్ఞాపించిరీ ॥ పం ॥

లంచములు దెమ్మనుచు వాచర్లందరును సంసార్ల నిర్బంధించిరీ వాదము బెంచిరీ ॥ పం ॥

ఇంచుకంత కటాక్షముంచక యెలమి రేంజరు ఘోరల నాలోచించెను అర్జిప్పించెను ॥ పం ॥

అంచితంబా కలకటరుగారైన పరిశీలించకను దండించెను ఖయిదువిధించెను ॥ పం ॥

చంచలలు తమకాంతి విడచెను చందురుడు తలక్రిందుగా కనుపించెను భూమితపించెను ॥ పం ॥

మంచమున చెలరేగి యెండకు మానునల్లుల గతిజనుల్ జీవించరా నీమము లుంచరా ॥ పం ॥

కంచమిచ్చినగాని బుక్కెడు కవళమేయక నెట్టుదురు బ్రతికించరా శిరిఘుట్టియుంచరా ॥ పం ॥

మంచుగడ్డలపగిదినీరే మానవులడెందంబులను నివసించవె కీర్తి వహించవే ॥ పం ॥

వంచనగ కర్నూల్ వర్తకులు గుంటూరుధర మండించిరీ రైలుకు నంచిరీ ॥ పం ॥

సించివెస ధూలించి పరుగిడ జేసి మేఘుని వాయుదే డలంచగా నెరికలహించెగా ॥ పం ॥

అంచులందుండూళ్ళనల్ల గలంచి మనకృష్ణానది ప్రవహించెను కాల్వాలు తెగించెను ॥ పం ॥

కుంచయొరుకల వాండ్లుగుమ్ములు గోసిగింజలు గోనెలకు కట్టించిరి పాడలాయించిరి ॥ పం ॥

కించలేకను బందిపోట్లతి ఖిన్నులను లుబ్ధులను సాధించిరీ బహువేధించిరి ॥ పం ॥

కాంచనముకై పాశమును వడిగట్టిరని కలకత్త కడలికి పంచ కేభువి గుంగించకే ॥ పం ॥

చెంచులాకలిచేత మనకిక జీవనము లేదనుచుకను దుఃఖించిరీ నరిశుష్కించిరీ ॥ పం ॥

వాంఛదీరగ నరుల దుర్ముఖి వత్సరంబీ హేవళంబికలంచెగా సంపదలంచెగా ॥ పం ॥

ఔంచవాగుల వరము సుపినాకేశ్వరుని పార్థించ సంరక్షించును పంటఫలించునూ ॥ పం ॥

మించు నరికొండాన్వయుడ లక్ష్మీనరసింహుడ నినునే భజియించితీ కృతిరచియించితీ ॥ పం ॥